శ్రీ



# జయతీర్థవిజయము

గ్రంథకర్త

వళ్ళె పూర్ణప్రజ్ఞాచార్యులు,
గర్తపురోన్నతపాఠశాలా ప్రధానసంస్కృతోపాధ్యాయులు.

గుంటూరు. చంద్రికా ముద్రాశాలయందు
ముద్రితము.

ప్రకాశకము :

గుంటూరు మాధ్వసంఘము

1937

శ్రీ

# జయతీర్థవిజయము

గ్రంథకర్త

పళ్ళె పూర్ణప్రజ్ఞాచార్యులు,

గద్దపునోన్నతపాఠశాలా ప్రధానసంస్కృతోపాధ్యాయులు.


ప్రకాశకము:

గుంటూరుమాధ్వసంఘము

1937

ప్రథమ ముద్రణము

౫౦౦ ప్రతులు

*

గుంటూరు

చంద్రికాముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

*

శ్రీహయగ్రీవాయ నమః

# ఉపోద్ఘాతము

కొలఁదిమాసములక్రిందట నీయూర 'గుంటూరు మాధ్వసంఘ' మనుపేర నొకసంస్థ యేర్పడి పనిచేయు చున్నవిషయ మశేషమాధ్వజనులకును విదితపూర్వమే. మాధ్వమతస్థులపురోభివృద్ధికి వలయు మతనైతికాదివిషయములఁ బెంపొందఁజేయుట యీసంఘమువారియుద్దేశములలో నొక్కటి యగుటచే శ్రీమదానందతీర్థభగవత్పాదుల మూలగ్రంథంబు లన్నింటికిఁ డీకల రచించియు సుధాద్యుత్తమగ్రంథంబుల నిర్మించియు ద్వైతమతమహాసౌధమునకు మూలస్తంభభూతు లగుశ్రీజయతీర్థుల జీవితచరిత్రమును దత్పుణ్యాదినంబునఁ బెద్దలవలన వినుట కొకసభ సమావేశపఱచఁబడెను. తత్సభలో నుపన్యాసకులలో నొక్కరగు మధ్వశ్రీ పళ్ళె పూర్ణప్రజ్ఞాచార్యులుగారు శ్రీజయతీర్థుల జీవిత ముపన్యసించుచుఁ దదేకదేశమును బద్యములుగ సైతము రచించి సభ్యుల నానందాబ్ధి నోలలాడించిరి. అప్పుడే మాసంఘసభ్యులలోఁ గొందఱము తత్సమగ్రచరిత్రమును బూర్తిగావించుటకు శ్రీయాచార్యులవారిని బ్రార్థించియుంటిమి. వెంటనే శ్రీయాచార్యులవారు శ్రమను లెక్కింపక యక్కార్యము నిర్వర్తించి యుచ్ఛ్వాసత్రితయాత్మకమగు 'జయతీర్థవిజయ' మను నీపొత్తమును మాసంఘ

మున కర్పించి మాసంఘముపట్ల గాఢానురాగముఁ జూపినందులకు మే మెంతయు వారి కనుదినకృతజ్ఞులము. అయాచితముగా నేతద్గ్రంథముద్రణంబునకు వలయుద్రవ్యమునెల్ల నేనే యొసంగెదనని వాగ్దానమొనర్చి యచిరకాలములోనే యీపొత్తము వెలువడుటకుఁ దోడ్పడినయస్మత్సంఘాధ్యక్షులగు మ. రా. రా. పొర్ల నరసయ్యపంతులుగారికిఁ గృతజ్ఞతాపూర్వకవందనశతంబు లర్పించుచున్నాము. ఇట్లే యీ మాపేదసంఘ మేతాదృశోదారమణులకృపకుఁ బాత్రమై దినదినాభివృద్ధిఁ గాంచుతమని శ్రీహరిగురువులఁ బ్రార్థించుచున్నాము.

గుంటూరు,<br>7–10–37.

వుమ్మెత్తాల రామారావు,<br>కార్యదర్శి.

శ్రీహయగ్రీవాయ నమః

# శ్రీజయతీర్థవిజయము

## ప్రథమాశ్వాసము

శా. శ్రీవాదీంద్రమునీంద్రపూజితపదున్ సేవావినమ్రావళీ
కైవల్యప్రదు భక్తిమార్గసులభున్ గల్యాణసంధాయి వి
ద్యావాసావసథంబు సర్వనిగమాంతవ్యాపకున్ శ్రీహయ
గ్రీవున్ దేవు నభీష్టసిద్ధికి మదిన్ గీర్తింతు నశ్రాంతమున్.

ఉ. భారతపారిజాతసురపాదపమున్ శుకశీతరశ్మి వి
ద్యారమ బ్రహ్మసూత్రసుధఁదంత్రపురాణసముచ్చయంబు లన్
సారమహామణుల్ కడుపుఁజల్లఁగఁ గాంచిన బాదరాయణ
క్షీరపయోధి మాకు దయచేయుత శ్రీయును ధీయు నాయువున్.

శా. స్వాంతధ్వాంతనికృంతనంబున రవిన్, సంతాపనిర్మూలనా
క్రాంతిన్ శారదచంద్రికామలరుచిన్, గంభీరతన్ వార్ధి, న
త్యంతంబున్ నగఁజాలుభాష్యము యదాస్యంబందు నుద్భూతమై
సంతోషంబు ఘటించెఁ గొల్తు నత మాసర్వజ్ఞగుర్వగ్రణిన్. 3

సీ. నిన్నఁజెప్పినవెగా 'నాన్నా!' యనుచుఁ జిన్న
నాఁటనే ధీశక్తిఁ జాటె నెవఁడు
జనిచేతఁగాక చించాబీజములఁగూడఁ
దివిరి పితౄణంబుఁ దీర్చె నెవఁడు

కంఠీరవుం డ్రివిక్రమభట్టు సభను ని
ర్జించి ద్వైతమ్ము నిల్పించె నెవఁడు
ఆనందదాయకం బవు శాస్త్రమును బ్రసా
దించి యన్వర్థాఖ్య మించె నెవఁడు

గీ. అట్టిప్రతిభాధురీణుండు హరిపదాబ్జ
బంభరితమానసుండు దుర్వాద్యఖర్వ
గర్వనిర్వాపణాతిప్రగల్భుఁ డస్మ
దీయహృదిఁ గ్రాలు నానందతీర్థగురుఁడు. 4

గీ. మధ్వమునిసేవనాలబ్ధమహితవిద్యు
శాంతు సుఖతీర్థమునిసమనంతరంబ
ద్వైతరాజ్యాభిషిక్తు నద్వైతతిమిర
దినమణిం బద్మనాభతీర్థుని దలంతు. 5

క. నరహరిమాధవతీర్థులఁ
బరమార్థవిచారణైకపరతంత్రుల శ్రీ
హరిపాదభజననిరతుల
గురులన్ బ్రణుతింతు మధ్వగురుపదగతులన్. 6

క. గణ్యతమ 'తత్త్వమ' స్యసి,
వాణ్యాహి దేశికుఁడు తీరుపరిగా విద్యా
రణ్యారణ్యముఁ జెండిన
గుణ్యుం డక్షోభ్యమౌని గొను మన్నుతులన్. 7

శా. అక్షోభ్యోదయపర్వతాగ్రమునయం దావిర్భవంబంది వే
దక్షోదక్షమగోసహస్రముల నుద్యద్దుర్మతధ్వాంతజా
తక్షోభం బొనరించి సద్ధృదయపద్మస్ఫూర్తిఁ గావించు ప్ర
త్యక్షార్కుండు జయాఖ్యగురుం డలరుఁగాత న్మన్మనోఽభ్రంబునన్.

క. తక్కఁగలగురువరేణ్యులఁ
జక్కని పెనుబాట మధ్వశాస్త్రంబునకున్
నెక్కొల్పినయతివర్యుల
మ్రొక్కుదు నానందతీర్థమునిపీఠగులన్. 9

మ. తనగాంగేయత ధర్మబోధనవిదగ్ధత్వప్రసంగంబు ద
క్షిణగంగాతటవాసమున్ బ్రకటముల్ సేయన్ స్వవిజ్ఞానవ
త్తను బేరున్ స్వకరాంబుజోద్భవులు సత్యధ్యానులున్ ధాత్రియం
తను జాటన్ బొగడొందు దేశికుల సత్యజ్ఞానులన్ గొల్చెదన్.

శా. శ్రుత్యంతార్థమునందు యత్ప్రతిభ హెచ్చెందత్పరాకాష్ఠకున్
సత్యేశాస్యముఁ బాసి భారతి యదాస్యంబందు నర్తించి యా
న్నత్యంబుం గనె వాదిదంతులకు యన్నామంబు పంచాస్య మా
సత్యధ్యానమహాగురూత్తమునకున్ సాష్టాంగ మర్పించెదన్. 11

సీ. వివిధదేశాయాతవిద్యార్థిసందోహ
సుందరం బెవ్వానిమందిరంబు
సంతతాంతేవాసిజనధర్మపాలన
పావనం బెవ్వానిజీవనంబు

శతవధానవిధానచణకవీట్సమిదసా
ధారణం బేవాసిధారణంబు
నిఖిలవిద్యాసమున్నిద్రవిద్వద్వచో
భూషణం బేవానిభాషణంబు

గీ. అట్టికాశ్యన్వవాయసీహారకరుని
ఖండఖండాంతరాతివిఖ్యాతు మామ
కీనవిద్యాభివృద్ధినిదానభూతు
మద్గురుం గృష్ణపండితు మదిఁ దలంతు. 12

మ. జననుత్యంబు సతీత్వ మేజననికిన్ సద్భాషణం బేబుధా
ననపంకేరుహ మాంధ్రభారతగవీనాట్యస్థలం బాయశో
ధనులన్ మామకజన్మహేతువుల మత్పూత్యతుదైవంబులన్
వినుతింతున్ మదిఁ దల్లిదండ్రిలను గావేరీజగన్నాథులన్.

క. పలుకుంజెలి శ్రీజయతీ
ర్థులచరితము నుడువునాకుఁ దోడై రసముల్
వెలితివడునెడలఁ జేఁగల
జిలుఁగుంబొందమ్మితేనెఁ జిలుకుం గాతన్. 14

క. వనజాక్షుకటాక్షము గురు
జనములయాశీస్సుఁ బౌరజనములకూర్మిన్
గనుచున్ విద్వజ్జనభా
జనమై 'గుంటూరుమాధ్వసంఘ' మలరుతన్ 15

శా. ఈసంఘాన జయీంద్రపుణ్యదినమం దేతత్కథాంశం బుప
న్యాసం బీయఁగ మెచ్చి సంఘము సదోనాథుండు సోత్సాహునిన్
జేసెన్ సన్ను జయీంద్రచరిత్రము నితిశ్రీయుక్తముం జేయఁగా
నీసత్కావ్యము తత్కృతజ్ఞతకు నే నీకొంటి సంఘానికే. 16

గీ. సంఘమునకు శిరోమణి సంఘనేత
యగుట నతనికె యిక్కృతి తగునటంచు
సభ్యులమనంబుఁ గబ్బంపుఁజానమదియుఁ
దెలిసి యధ్యక్షునకె యీయఁ దలఁచినాఁడ. 17

సీ. శ్రీమదానందతీర్థామలపాదయు
గాంభోజరతమనోబంభరునకు
అతినైపుణీసమర్థితజనతాస్తోత్ర
పాత్రీభవన్మాన్యయపతిపదునకుఁ
బ్రతిమాసపహాణరాద్రప్రహితరూప్యకశతా
న్వితోపకారికవేతనునకు
వరగుణపౌర్లాన్వవాయదుగ్ధాంభోధి
వర్ధనపర్వజైవాతృకునకు

గీ. ధీరున కుదారమణికి గుంటూరుమాధ్వ
సంఘనేతకు నరసార్యసత్తమునకుఁ
గృష్ణవేణీప్రియునకు నంకిత మొనర్తు
వేడ్క మామకజయతీర్థవిజయకృతిని. 18

సీ. తగినవరుం డంచుఁ దలఁచి రాఘవునకే
పెద్దకొమార్తె నర్పించినాఁడ
నవరసోపేత రెండవకూఁతుఁ గృష్ణదే
శికునకే యిడి పెండ్లిచేసినాఁడ
మూఁడవకొమిరె లోకేడిత నొసఁగి శే
షగిరిబుధుం గేస్తు సలిపినాఁడఁ
దగినసంబంధంబు లగుపించమిం జేసి
యొకకొందఱిని నట్లె యుంచినాఁడ

గీ. మత్పురాకృతసుచరిత్రమహిమఁ జేసి
వెదకకయె నాదుజయతీర్థవిజయకృతికిఁ
దగినవరుఁడవు దొరకితి, తనిసె మనసు
సరసగుణధామ ! శ్రీపార్థ సరసనామ ! 19

చ. గుణవతి మంజుమంజుపదగుంఫ మనోహరవృత్త సాధుల
క్షణయని మామకీనకృతికన్య వరింతువుగాని సద్వరా
ర్హాణములకోర్కి మాను హృదయంబునఁ, బెక్కురుకావ్యకన్యకా
మణు లలరారుమాకుఁ దరమా భరియింపఁగ నట్టికట్నముల్.

గీ. కన్నె మేన నలంకృతుల్ గలవు కొన్ని
తప్పదు సువర్ణముద్రి యుద్వాహమగుట
నింతకంటెను బేదవా రేమి యిడుదు
రేలుకొను కబ్బపుంగన్నె మేలు కలుగు. 21

చ. నిపుణతఁ జాగ్రిడ్స్వాకపదనిర్వహణం బొనరించి మేలునా
నుపకృతివేతనంబు నెల కొక్క-శతంబు గడించుమీకు మా
యుపదల నేమి? నీపయి జయోరుకథాకవితాసరస్వతీ
కృప ప్రసరించెఁ గై కొనుము కీర్తియు నాయువుఁ దేజమోజమున్

క. తలవాకిటనె మెలఁగు ర
చ్చల కెక్కక జూఱఁగొనును సరసులదృష్టుల్
తెలిపితి దీనిప్రకృతి; కృతి
జలజాక్షులయందుఁ గోరఁజను నివి యనఘా! 23

క. దోషజ్ఞమాళి! యిది మృదు
భాషల మధురాశయముల బంధురనానా
శ్లేషలఁ దనుపు నిను గృతి
యోషామణి పాణిఁ గొని మహోన్నతిఁ గనుమీ! 24

## —* కథా ప్రారంభము *—

మ. దివిజేంద్రుండు మహేశ్వర ప్రభృతు లర్థిం గోరుసచ్ఛాస్త్రమూర్
తి శ్రవణంబుం బొనరింపఁగా వృషభమై జన్మించి యానందతీ
ర్థవధూతాగ్రణి చెంగటన్ నిలిచి తద్గ్రంథంబులన్ మోయుచున్
వివిధామ్నాయరహస్యముల్ వినుచునుండెన్ నిత్యమేకాగ్రతన్.

సీ. గోరాజు తా నౌట గోరాజసద్వేష
ధారణంబే ముఖ్యధర్మ మనియు
ఇక్ష్వాకునకుఁ దొల్లి యెక్కిరింతగ గెల్పు
గనఁ జేసినట్టిస్వాకార మనియు
కామసంవర్షణగణ్య మామ్నాయప్ర
థితము శబ్దబ్రహ్మదేహ మనియు
గ్రంథధారణసమాకర్ణనాదికమున
కీమేన నవకాశ మెక్కు డనియు

గీ. వేల్పు జేఁ డితరాకృతుల్ వీడి వృషభ
మూర్తియై, భావివిధివాయుమూర్తిరూపుఁ
డగుట నుత్తమగురుఁడని యాత్మ నెంచి
శ్రీమదానందతీర్థుల చెంతఁ జేరె. 26

గీ. విష్ణునందు ననన్యమై వెలయుభక్తి
పూర్ణబోధయతీంద్రసద్బోధనంబు
తారకం బగుసచ్ఛాస్త్రధారణంబు;
ఎంతవారికొ గా లభియించు జగతి! 27

ఉ. ఆవృషభాన్వయాభరణ మన్వహముఙ్ సుఖతీర్థసంయమిన్
దేవరఁగాఁ దలంచి తదుదీరితభాష్యముఖంబుఁ దన్ముఖం
బై వినుచుం దదంతికగతాఖిలశిష్యజనంబుకంటెఁ ద
ద్భావము వేమడుంగు లెడఁదన్గ్రహియించుచునుండె మెండుగన్.

క. తల యూఁపుఁ దెలిసినప్పుడు
తెలియనియపు డట్టె చూచు దేశికు మోముఙ్
గనుఁగొనల హర్షబాష్పము
లను బూనుఙ్ విష్ణుగుణములఙ్ వర్ణింపన్. 29

సీ. అరసె నచిరకాలమందె విష్ణ్వఖిలోత్త
మత్వోపయోగిప్రమాణకోటి
తెలిసెఁ గొన్నాళ్ళలోపలనె మిన్నగ జగ
త్సత్యత్వసాధకశాస్త్రచయము
గ్రహియించె బహువిధాగమములతోఁ దార
తమ్యసంస్థాపకాధారపటలి
మతిఁజొన్పె నిగమప్రమాణాళితోఁ బంచ
భేదబోధకశాస్త్రవాదసరణి

గీ. ముక్తి యన నైజసౌఖ్యానుభూతి, విమల
భక్తియే యట్టిముక్తికిఁ బ్రాపకంబు
లోనుగాఁగలవిషయంబులును గ్రహించెఁ
గొలఁదినాళ్ళనె గోరాజు గురునిసేవ. 30

శా. ఆచార్యాగ్రణి జైత్రయాత్రలను జేయంబోవఁ దద్దేవస
ధ్రీచీనంబులు పేటికానివహముల్ శ్రీవారిగ్రంథంబులున్
ప్రాచుర్యంబుగఁ బూని వెంటఁజని విద్వద్గోష్ఠులన్ వాదముల్
తూచాతప్పకయుండ నెమ్మనమునందున్ దాల్చు గోరా జహా!

క. సవిధైకవర్తనము స
చ్ఛ్రవణప్రవణాంతరంగసంపద యాఁగో
ధవునెడఁ గలిమికి సంతస
మవుడుం దలపోసె నిట్టు లాచార్యుఁ డెదన్. 32

చ. వృషభము లెందు లేవె పృథివిన్, గనినారమె యీవివేక మే
వృషభమునందునేని, యిది వింతగదా! యెవఁడేని దేవతా
వృషభుఁడె యీవిధానఁ బ్రభవింపఁగనోపు, నబద్ధమేని యీ
విషయపరిగ్రహం బధికవేత్తృత కొండొకచోట నుండునే?

క. అనఘుఁడు గురుఁ డది మొదలుగఁ
దన కెదురుగ నుంచి వృషభతల్లజు, దానిన్
గనుచునె పాఠము సెప్పెడుఁ
గను లెత్తగనాయె శిష్యగణమున కంతన్. 34

శా. ఏమీ యీవృషభంబు ధీబలమునన్ హెచ్చెనె మాకంటె, మా
స్వాముల్ దీనిని మిన్నఁజేయుచుఁ దదాస్యంబె నిరీక్షించుచున్
శ్రీమద్వైష్ణవదర్శనంబు నిట నిక్షేపింతు రీమానిసుల్
గోమాత్రంబును జేయు రేయని మదిన్ గుళ్ళేర్పడెన్ వారికిన్.

గీ. ఏమియుం జేయలేక వా రెప్పటట్ల
చదువుచుండిరెగాని యాచార్యునొద్దఁ
బాఠసమయాన గురుఁడు గోపతిమొగంబుఁ
గని వచించుట వారికిఁ గంటకించె. 36

శా. శ్రౌనాన్క్లిష్టపగిదిన్ గతించుపిదపన్ గూఢార్థగాంభీర్యసం
పన్నంబుల్ విబుధైకబోధ్యములు తద్వ్యాఖ్యాదు లేటీకలే
కున్నన్గోచరమౌనె మాదృశులకంచూహించి యాచార్యుతో
విన్నాణంబుగ విన్నవించుకొని రావిద్యార్థు లిబ్భంగిగన్.

క. అంభోనిధియే మిక్కిలి
గంభీరము దానికంటె గంభీరము వా
గ్గుంభనము తావకము గుణ
సంభావిత ! మాదృశులకు శక్యమె తెలియన్ ? 38

క. శేషాదుల కేని భవ
ద్భాషణములయర్థ మెఱుఁగఁబడ దన విద్యా
భూషణ ! మాబోం ట్లర్థముఁ
బోషింతురె టీక వ్రాయఁబూనర యేనిన్ ? 39

ఉ. నావుడుఁ బూర్ణబోధయతినాథుఁడు 'శిష్యవరేణ్యులార! యీ
గోవిభుఁ డస్మదీయకృతికోటికి మేటిగఁ డీక వ్రాయు' నాఁ
గా విని యీసునన్ బఠనకాలమునన్ వృషభంబు పాముచేఁ
జావును గాంచుఁగాతమని శాపమొసంగిరి శిష్యు లుగ్రులై.

శా. నోరున్ వాయియు లేనిజీవముగదా నో రెట్టులాడెం గటా !
గోరాజుం బగఁబూని యిప్పగిది నెగ్గుల్ వల్కఁగా; సంయమి
స్వారాజౌ సుఖతీర్థభిక్షుకుకడన్ శాస్త్రంబులన్ నేర్వరే ?
సారాసారవిచారణల్ గలవె ? యీర్ష్యాగ్రస్తులౌ వారికిన్.

గీ. ఒజ్జ కభిమానపాత్రమై యుంట గురుని
పాఠములు వింట జ్ఞానంబుఁ బడయుచుంట
గూడ దోషంబు లాయెఁబో గోవుపట్ల
గుణము లొకవేళ నగు నవగుణము లౌర ! 42

శా. అంతన్ శ్రీసుఖతీర్థపూజ్యచరణుం డాత్మన్ విచారించి య
య్యంతేవాసుల దూఱి యూఱడిలుమం చాగోవుతోఁ బల్కి వా
రెంతేఁ దన్మహిమం బెఱుంగుటకు నిర్హేతూద్భవంబౌ కృపన్
జింతల్ వాయ గవీశుచేతఁ బలికించెన్ ద్వాదశస్తోత్రముల్.

క. చేయన్ మానన్ వేఱుగఁ
జేయన్ సామర్థ్య మున్న, శిష్యులశాపం
బాయతి త్రోయఁడు, భవిత
వ్రాయతి గుర్తెఱిఁగినట్టి యనఘుం డౌటన్. 44

ఉ. కుందదుగాని యావృషభకుంజర మవ్విధి శిష్యులెల్లఁ ద
న్నుం దయమాలి సర్వహతి నొవ్వుమటంచు శపించినందు కా
నందపదానుభూతి గగనంబగునోయని తల్లడిల్లె, నా
నందపదానుభూతి త్రిగుణంబుగ నబ్బుటఁ దా నెఱుంగదో !

చ. అది గని పూర్ణబోధయతి యక్కట! యీవృషభంబు నావియో
గదశకుఁ దల్లడిల్లునటు గన్పడుఁ గన్నుల నీరు నింపెడున్
బెదవుల ముట్టదే తృణము బిక్క మొగంబునఁ జూడసాఁగె నా
వదనము నట్టె, దీనివలవంతలు దీర్చుట న్యాయమంచొగిన్.

గీ. ఊఱడిలు మోయివృషభేంద్ర! యూఱడిలుము;
శిష్యశాపంబు శ్రేయమే చేయు నీకు;
దేహములు శాశ్వతంబులే? దీని కింత
వగతురే? దైవవిధి దాఁటవశమె యెందు? 47

గీ. యోగు లెప్పుడు యోగవియోగములకుఁ
బొంగక తితిక్షు లగుదు రధ్రువము లనుచు
'ఆగమాపాయిన' యటంచు నర్జునునకుఁ
గృష్ణభగవానుఁ డిదె తెల్పె గీతలందు. 48

ఉ. వచ్చెడుమేను నీకు ననవద్యము హృద్యమునౌ, యశం బటన్
హెచ్చఁగఁగాంతువొక్కఁడుయతీంద్రుఁడు తావకగోపతిత్వము
న్మెచ్చఁగ జ్ఞప్తిఁజేసి తొలివృత్తము విద్య స్ఫురింపఁజేయు న
త్యచ్ఛత కెంతయే నతఁడు తోడ్పడు నీకు విచార మేటికిన్?

ఉ. 'దేవర! టీక వ్రాసి భవదీయకృతుల్ వివరింపుఁ' డన్న నీ
గోవె యొనర్చునంటి, నిది గోజని సాధ్యమె? వేఱె పుట్టువుం
గావలదే? యిఁ కేటికి వగల్? సహియింపుము మద్వియోగము
న్నావలెనన్నయప్పు డొకకంట నినున్ గనిపెట్టియుండెదన్.

గీ. వాదివిజయంబులందుఁ డీకాదివిరచ
నముల సందిగ్ధవిషయనిర్ణయములందు
నొకట ననసేల పిలిచిన 'నో' యటంచు
మెలఁగుదును నీకు రాఁబోవు మేనియందు. 51

క. మదిఁ గలఁగకు, కలుగుఁగా మ
త్పదసంపల్లబ్ధి భావిభవమునఁ గూడన్
గొద యుండదు, కాఁగల వా
స్పదమవు దిగ్విజయరామచంద్రునికృపకున్. 52

గీ. అనుచు శ్రీరామదేవపూజాతిపూత
మాకరంబునఁ దనుఁ దట్ట నట్టె గురుఁడు
భానుకరహతిఁ జీఁకటిభాతి వృషభ
పతిమనోగ్లానియుం బటాపంచలయ్యె. 53

చ. పదపడి యొక్కనాఁడు వృషభంబు మునింగి సరోవరంబులో
నుదయమె శిష్యు లందఱికి నొజ్జలు శాస్త్రము బోధసేయుచో
నెదురుగ వించు నున్నతటి నెక్కడనుండియొ వచ్చి మాయపా
మదయతఁ గాటు వేసె విష మగ్గలమై వృష ముర్విఁ ద్రాలఁగన్.

గీ. భుజగ మంతనె మాయమై పోయె, వృషము
నోటఁ జొంగయు నురుగుఁ గన్గొఁగనాయె
శిష్యశాపంబుగాఁ దలంచెను గురుండు
నిదురవలె గోవిభుఁడు దీర్ఘనిద్రఁ గాంచె. 55

గీ. తపము సర్వంబు నారీతి ధారవోసి
సాధువృషభంబు శపియించి చంపినాము ;
ఎంతపనిఁ జేసె నయ్యొ మాయీర్ష్య యనుచుఁ
దల్లడిల్లిరి విద్యార్థు లెల్ల నాత్మ. 56

క. గురువర్యునాజ్ఞమెయిఁ ద
చ్చరమక్రియ లాదరమున సలిపి తదాత్మో
ద్ధరణమ్మునకై గావిం
చిరి భగవత్ప్రార్థనముల శిష్యులు భక్తిన్. 57

ఉ. ప్రొద్దున నీట మున్గి సుఖబోధులబోధము సన్నికృష్టమై
తద్దయు వించు డెందమున ధారణసేయుచు నశ్రమంబుగా
నెద్దు శరీరమున్ విడిచె నెంతయదృష్టముపట్టెఁ బ్రాణికిన్
'గద్దె'పుడేనిఁ జా, విటులుగల్గునె యొంతటియోగికేనియున్ ? 58

గీ. చిన్నవోయెను మఱునాఁడు శిష్యజనము
పాఠసమయాన గురునగ్రభాగ మెల్లఁ
జిన్నవాయెను మఱునాఁడు శిష్యజనము
పాఠములుగూడ గ్రహియించుప్రభువు లేమి. 59

క. కొన్నాళ్ళదనుక నెదుటనె
యున్నటు వృషభంబు గురుఁ డటూఱక చూచున్ ;
ఉన్నతిఁ గనఁదగుశిష్యుం
డన్నన్ దేశికుల కాత్మ నట్టులె యుండున్. 60

మ. తరువాతన్ మఱికొంతకాలమునకున్ దత్త్వజ్ఞులై భక్తిసు
స్థిరులై పంకజనాభులున్ నరహరుల్ శ్రీమాధవాక్షోభ్యమ
స్కరులున్ దక్కినశిష్యులున్ విజయముల్ సాధించుచున్ వాదిభీ
కరులై ద్వైతమతంబు నెల్లెడలఁ బ్రఖ్యాతంబు గావించినన్

గీ. శిష్యు లెంతయు నెక్కువచ్చిరి మతంబు
వ్యాప్తిఁగనెఁ గృతి నంచు మధ్వయతిమౌళి
గురువరేణ్యుల దర్శించుకోర్కి మనసు
బదరికాశ్రమసీమపైఁ బరుగులెత్త. 62

మ. కలిలో డెబ్బదితొమ్మిదేండ్లు నెలలుంగా నాలువింశత్యహం
బులు సద్భక్తి భజించి దిగ్విజయరాముల్ బద్మనాభాఖ్యతీ
ర్థుల కాస్థాన మొసంగి శాలిశకమందున్ ఖాఖీభూజ్యాలఁ బిం
గళసంవత్సరమాఘశుద్ధనవమిన్ గన్గొఁజనెన్ వ్యాసులన్.

మాలిని. జనవినుతచరిత్రా! సాధువాధూలగోత్రా!
అనుపమగుణతృష్ణా! యాత్మభూరామకృష్ణా!
వనజనయనభక్తా! వంద్యమధ్వాంఘ్రిసక్తా!
జననుతనరసాఖ్యా! సజ్జనాకాంక్ష్యసఖ్యా! 64

—* గద్యము *—

ఇది శ్రీకాశ్యపగోత్ర జగన్నాథాచార్యపుత్త్ర
సకలవిద్వద్విధేయ పూర్ణప్రజ్ఞనామధేయ
ప్రణీతం బగుజయతీర్థవిజయంబునఁ
బ్రథమోచ్ఛ్వాసము

శ్రీ

# ద్వితీయాశ్వాసము

క. శ్రీసత్కృపాకటాక్షా
వాసా! గుంటూరుపురనివాసా! విద్యా
వ్యాసంగనిరత! సరస
క్ష్మాసురహర్యక్ష! మాధ్వసంఘాధ్యక్షా! 1

క. గురుదత్తవేదవిద్యా
పరిపాలనభద్రపీఠభాసురులై గాం
చిరి కీర్తి వాదికరికే
సరు లాపైఁ బద్మనాభసంయమివర్యుల్. 2

ఆ. తిరిగెఁ బద్మనాభగురువరుం డాసేతు
శీతనగము వృద్ధిసేయ మతము;
స్వమతజనులవలన విమతులవలనను
భిక్షఁ గొనుచు వాదభిక్షఁ గొనుచు. 3

ఉ. పంకజనాభతీర్థముఖపంకజనిస్సృతవాఙ్మరందముల్
శంకలు లేక త్రావి బుధషట్పదముల్ శ్రుతిసమ్మతంబుగా
ఝుంకృతిసేయ నూతనవసంతవిజృంభణ మొప్పెఁబో నిరా
తంకము మధ్వనిష్కుటభృత మ్మగుద్వైతమహావనమ్మునన్.

గీ. అట్లు శ్రీపద్మనాభసంయమి జయించి
యతుల నరహరితీర్థధీవరుల కొసఁగి
స్వీయపీఠంబు రక్తాక్ష్యసితచతుర్ద
శీతిథిం గార్తికమ్మునఁ జేరె హరిని. 5

క. నరహరియతియున్ స్వమతము
నిరుపమ మనిపించి వాదినికరముచేతన్
గురుయశుఁడై చేరె రమే
శ్వరు శ్రీముఖపుష్యబహుళసప్తమినాఁటన్. 6

క. మాధవసంయమి నరహరి
సాధులచేఁ బడసి మాధ్వసామ్రాజ్యం బా
రాధించి రాము దేహో
పాధిన్ విడె వికృతభాద్రపదచరమతిథిన్. 7

శా. అక్షోభ్యుం డటుమీఁదఁ దత్పదవి నధ్యక్షించి వాదీభహ
ర్యక్షఖ్యాతి గడించి దుర్మతతమిస్రాహ్రీససాక్షాజ్జగ
చ్చక్షుండో యన మించి దిగ్విజయముల్ సాగించుచున్ భిన్నులన్
ప్రేక్షావంతుల శిష్యులన్ సలుపుచున్ బేర్వాసిఁ గాంచెన్ గడున్.

గీ. బ్రహ్మహత్యాదులన్ సంఘుబాహ్యు లవని
దేవు లిర్వురు నిష్కృతిఁ దెలుప వేఁడ
వారియనుతప్తిఁ గని శంఖవారి వారిఁ
బూతులం జేసినట్టి సత్పుణ్యుఁ డితఁడె. 9

గీ. శిల్పితో యతి కిమ్మని చెప్పి, శిల్పి
కడను గొనుమని యతితోడ నుడివి, కలను
విఠలస్వామి యిమ్మహావిబుధుపూజఁ
గైకొనఁగ వేడ్కపడె నెంతగణ్యుఁ డితఁడు ! 10

క. వేదాంతులు శ్లాఘింపఁగ
వేదవ్యాఖ్యాత యైనవిద్యారణ్యున్
వాదాజి గెలుచువిద్యా
క్షోదక్షముఁ డైనవాదిశూరుం డితఁడే. 11

క. అని తనుఁ గొనియాడఁగ బుధ
జను లక్షోభ్యుండు తిరిగి తన్మండల మె
ల్లను భీమరథీసరిత
స్వనిచేరువ కేగుదెంచె శిష్యులుఁ దానున్. 12

ఉ. పొంగుచు నాస్రవంతి యతిపుంగవుఁ జెంగటియుండె గాంచిని
స్సంగ! మహానుభావ! యిటస్నాన మొనర్చి కృతార్థుఁ జేయుమం
చుం గుయివెట్టుచున్నదనఁ జూపఱకుం గనిపించుచున్ మహో
త్తుంగతరంగహస్తములతోఁ గడిగెన్ మునినాథుపాదముల్.

సీ. జాడ్యంబు పోఁద్రోయఁజాలుతీర్థము లీరు
తగ జాడ్య మొసఁగుతీర్థముల మేము
అకుటిలవర్తనులౌ మహాశయు లీరు
సకుటిలగతిజడాశయుల మేము

నిరుపమానాభంగపరజీవనదు లీరు
నవభంగయుతజీవనదుల మేము
దరిఁజేరఁగాఁ దేల్చుసరసాంతరులు మీరు
దరిఁజేరఁగా ముంచువిరస లేము

గీ. మీకు మాకును నింతటిమేర గలదు
పావనులమంచు మము జనుల్ పలుకు టెల్ల
మిమ్ముఁబోటులయవగాహనమ్ముకతన
శుభ మొసఁగె మీదురాక యక్షోభ్యతీర్థ ! 14

సీ. నాయెడఁ గుంకి మీరఘునాథదేవుఁ
గనెడుభాగ్యంబు యతివరా! కలుగఁజేయు
మప్ప నిలవుంచఁబోము మాయప్ప! కొలఁది
నాళ్ళఁ జూపుదు నొకరఘునాథు మీకు. 15

గీ. అనుచు బోధించుచున్నదో యనఁగ నొప్పు
భీమరథిఁ జేరి సంయమిస్వామి దిగుడు;
నమలతద్వారిఁ బ్రతిబింబ మరయవచ్చె
నదియె తన కొంక్కయతిఁ జూపెనా యనంగ. 16

ఉ. తాపనివారకం బయినతజ్జలమజ్జనముం బొనర్చి దీ
క్షాపరుఁడై సురార్చనము సల్పి తటింగలపాండురంగల
క్ష్మీపతిపాదదర్శనముఁ జేసి సశిష్యజనుండు సంయమి
క్ష్మాపతి యందునన్ దపముసల్పుమనంబు జనింప నెంతయున్

కం. అనుదినము భీమరథిలో
మునుఁగుచు శ్రీపాండురంగు మ్రొక్కుచు శాస్త్రం
బును శిష్యులఁ జదివించుచు
ముని దిగ్జయరామభజనమునఁ దగిలెఁ గడున్. 18

మ. ఒకనాఁటం గలలో నిశాంతమునదివ్యుం డొక్కఁ డేతెంచి మిం
చుకృపంబల్కె యతీంద్ర! ఱేపు చనుదెంచున్ భీమరథ్యాపగా
నికటంబున్ విభవాఢ్యుఁ డాశ్వికబలాన్వీతుండు సాదీశ్వరుం
డొకఁ డుత్తుంగహయాధిరూఢుఁ డతఁ డేయుష్మత్పదార్థుండిఁకన్.

ఉ. తుంగతురంగ మెక్కి యకుతూహలియాతఁడు దాఁటుచున్ నదిన్
వ్వంగియె గోవువోలె నట వారిని గ్రోలుచు నేఁగు నిట్టిగు
ర్రుం గని వాని రాఁబిలిచి తోడన యాశ్రమ మిమ్ము నమ్ము తౌ
రంగిక రాజు నీకు యువరాజునుగాఁ గయికొమ్ము మేలగున్.

గీ. ఉభయవంశపవిత్రుఁ డాయుత్తముండు
నీ కతనివల్లఁ గలుగు నస్తోకయశము
అని పలికి దివ్యుఁ డంతర్ధి యగుడు మేలు
కాంచి సంయమి విస్మయాక్రాంతుఁ డగుచు. 21

చ. గురువులు నాయెడం గలుగుకూర్మి నిటుల్ కలవచ్చియుండు న
చ్చెరు విది యిప్డె భీమరథిఁ జేరి కనుంగొనుచుండుఁగాక యా
పురుషునిరాక యంచు యతిపుంగవుఁ డానదికేఁగె శిష్యులున్
బిరబిర దేవతార్చనపుఁబెట్టెలతోఁ దను వెంబడింపఁగన్.

ఆ. వేఁగి స్నానమాడి యాగంగలో వాని
తీర దేశమందు దేవతార్చ
నాదివిధుల నెల్ల నాచరింపుచునుండె
వలికిడైన నేటివలనె గనుచు. 23

మ. మును శ్రీమధ్వమునీంద్రుచెంత శ్రవణమ్ముం జేయుగోరత్న మీ
ర్ష్యను శిష్యుల్ శపియింపఁగా భుజగదష్టంబై హతంబై పున
ర్జననంబుం గనె విప్రజాతిని మహారాష్ట్రంబునన్ దేశపాం
డ్యునియింటన్ రఘునాథనామమున ధోండోసాధువంశంబునన్

క. తల్లిందండ్రియుఁ బ్రాణము
దెల్లం దనపైనె కూర్మి నిడి మోవంగా
వల్లారుముద్దుగా నా
'పిల్లఁడు' నానాఁడు వృద్ధిఁ బెరుఁగుచునుండెన్. 25

ఉ. బాలుఁడు పంచవర్షముల ప్రాయమునం దనరారఁ దండ్రి ధీ
శాలిని జేయ వాని గురుసన్నిధి కంపెను. సర్వవిద్యలన్
లీల గ్రహించె వాఁ డనవలిప్తత స్వప్రతిభావిశేషమున్
మేలు సెబాస్ భళీయని యమేయులు దేశికులే నుతింపఁగన్.

క. ఉపనీతుండై యాతం
డుపదేశముఁ బడసె శ్రుతుల నోజ్జలకడఁ ద
త్కృప కెంతయు భాజనమై
యపరిమితప్రజ్ఞఁ జూపె నామ్నాయములన్. 27

గీ. తండ్రి సాదిశ్వరుం డౌటఁ దా హయాధి
రోహణాదులఁ గడుసముత్సాహి యగుచు
అశ్వహృదయం బెఱుంగునా యన నతండు
చతురుఁడయ్యెను గుఱ్ఱపుస్వారులందు. 28

చ. పరువము కల్మి ప్రాభవము పాండితి శేముషియున్ సురూపపుం
గరిమయు నాభిజాత్యమును గల్గినవాఁ డతియోగ్యుఁడంచు నా
నరనుతకీర్తి యైనరఘునాథునకుం దమకన్నె నీయ సం
బరపడి రాయబారులను బంపిరి తండ్రికి నెందఱెందఱో. 29

గీ. కొడుకు నూనూఁగుమీసాలకొమరుఁబ్రాయ
మలరువాఁ; డుండవలెఁ గోడ లని తలంచి
పితరు లొక్కసుశీలను బెండ్లిచేసి
రంతె యాతం డెఱుఁగఁ డేయభము శుభము. 30

మ. ఒకనాఁ డాసుభగుండు స్వారియెడ నత్యుత్సాహియై వెంట నా
శ్వికసైన్యంబులు దౌడుదీయ విపినశ్రేణుల్ స్రవంతీతటాం
తికభూభాగములెల్లఁ గ్రుమ్మరుచు నేతెంచెన్ రయంబార దై
వికయోగంబున భీమరథ్యనుతటోర్వీరాజమార్గంబుగన్. 31

గీ. అటకు వచ్చెడుసరికి మధ్యాహ్నమాయె
నశ్వఖురధూళి యాకాశ మావరించెఁ
జోద్య మిది యేమి యనుచు నక్షోభ్యయతియు
నవలిమొద్దున నుండి తా నరయుచుండె. 32

శా. ధోండో శ్రీరఘునాథుఁ డాశ్వికులతోడ్తో రాఁగ మధ్యాహ్నమా
ర్తాండుం డుగ్రతఁ జూప భీమరథి వార్వంబెక్కియే దాఁటుచా
యొండన్ నాలుకయొండఁ బ్రేక్షకులు సాదీశత్వనైపుణ్యముం
గొండాడన్ మనసారఁ గ్రోలె శిర మాకుంచించి తన్నీరమున్.

క. అక్షోభ్యతీర్థుఁ డది ప్ర
త్యక్షముగాఁ జూచి తలఁచి తత్స్వాప్నోక్తం
బాక్షణము పనిచె సాధ్య
ధ్యక్షుం గొనిరాఁగ శిష్యతతిఁ ; జని వారున్. 34

గీ. ద్వైతసిద్ధాంతసమాశ్రిత్పదంబుఁ దాల్చి
యున్నవా రిప్పు డక్షోభ్యు లన్నవారు
వార లట నుండి మిముఁ గొని తేర నాజ్ఞ
చేసినా రాశ్వికేశ ! విచ్చేయవలయు. 35

ఉ. నావుడు నల్లధోండురఘునాథుఁ డనెన్ వినయంబుతోడ 'నో
ధీవరులార ! వత్తు గురుదేవునిదర్శనముం బొనర్తు నేఁ
డావరసంయమీంద్రుకృప నందుదుఁగా' కని పాదచారిగా
నే వడి నేఁగి తన్ గనుయతీంద్రునకుం బ్రణమిల్లి నిల్చినన్. 36

గీ. వత్స ! కుశలంబె చూచినవానిపదిగిఁ
గానిపింతువు కావచ్చు గతభవమునఁ
దేజినుండియె జల్ప మానితివి నిపుణతఁ
బలుకుమా తొంటిమేన గోపతివె నీవు ? 37

చ. అన యతివర్యుఁ; డాసుమతి కప్డపుడే మెయి పుల్కరించెఁ, గ
న్గొనలను గౌతుకాశ్రువులుగూడె వృషాకృతిఁ బూర్ణబోధతీ
ర్థనికటమందు నేర్చువివిధశ్రుతిపుంజములుం దదర్థబో
ధనమును ద్వైతదర్శనపుఁదత్త్వములున్ స్ఫురియించె నన్నియుఁ

చ. యతిపతితోడ దిగ్విజయయాత్ర లొనర్చెడువేళ మాయిసం
తతులు పొనర్చువాదములు దానికి దేశికుఖండనప్రసం
గతులును ధోండెరాయనికిఁ గన్నులఁగట్టినయట్లుకాఁగ నా
తతముద మంది సంయమివతంసునితో రఘునాథుఁ డిట్లనెన్

గీ. యతిపతీ! తొంటిమేన గోపతివె? యనుచు
మీరు ప్రశ్నించుటది నాకు మేలుకూర్చెఁ
దత్స్మృతిన్ నాకుఁ బూర్వవృత్తాంత మెల్లఁ
గరతలామలకంబుగాఁ గానిపించె. 40

గీ. ఒక్క మాటనె యింతజ్ఞానోదయంబుఁ
గూర్చినారు విలక్షణగురువు లీరు
దాసుఁడను నేఁటినుండి యీతనువు మీది
యింక నీధర్మపుత్త్రిన కేమి సెలవు ? 41

ఉ. స్వామి!మిముంగనుంగొనఁగఁ జాలితిఁ బాపముఁదోలితిన్ గృహా
రామధనాదివస్తునికరంబున నాకు విరక్తి గల్గె మీ
కోమలపాదపద్మములకుం బరిచర్య యొనర్చుకొంచు నే
నోమహితప్రభావ! యిట నుండెద శిష్యు ననుగ్రహింపవే

గీ. నాఁగ యతినాథుఁ డనె రఘునాథుతోడ
వత్స ! యతులకు మా కేమివలయు మాదు
దిగ్విజయరామచంద్రుఁ డిదే త్వదీయ
పూజ లందుకొనంగ నుప్పొంగుచుండె. 43

ఉ. కావున నంతిమాశ్రమముఁ గైకొని దిగ్జయరామపాదరా
జీవయుగార్చనం బెపుడుఁ జేయుచు దిగ్విజయంబొనర్పు మో
ధీవర ! నీకతాన సుఖతీర్థసదాగమకోటి వృద్ధికిన్
రావలె నీదుకీర్తి సుచిరంబుగ నుండవలెన్ మహీంతలిన్. 44

గీ. నాకు నీరాకఁగూర్చి స్వప్నంబు వచ్చె
దైవసంకల్పితం బిది తప్ప దెపుడు
మాఱుపలుకక తుర్యాశ్రమంబుఁ గొనుము
శ్రీమదాచార్యవరులయాశీస్సుఁ గనుము. 45

మ. అని యక్షోభ్యయతీంద్రుఁ డాడ విని సాద్యర్ధ్యకుమాణిక్య మీ
యన యిట్లాడె, నెవండు మీకృతులు వ్యాఖ్యానించునా నీవృషం
బనె సర్వజ్ఞుఁడు తొల్లి యీర్ష్యమెయి విద్యార్థుల్ శపింపంగ దీ
వెన లీదృశమ్ము లిచ్చె నీయతి స్ఫురింపించెన్ స్వవాక్యంబులన్.

గీ. మాటతీరుగఁ బలుకుటో మత్పురాణ
గతి యెఱింగి వచించుటో మతి నెఱుంగ
వెనుక జరిగినదాని కీయనఘుఁ డనెడి
దానికిన్ సరిపోయె నిదర్శనముగ. 47

గీ. యతినె గాకున్నఁ డీకాదికృతులు వ్రాయ
నాకు శక్యమె శ్రీమదానందతీర్థ
విబుధకరపూజితాంఘ్రి దిగ్విజయరాము
నంట నర్హుండనే యని యాత్మ నెంచి. 48

క. మ్రొక్కి యతిమౌళి కనె నే
నెక్కడ రఘునాథపూజ యెక్కడ యుష్మ
ద్దృక్కులెగా కర్హులు మా
దృక్కులు తత్ప్రతిమ నంటనేనిఁ దగుదురే. 49

చ. అన యతినాథుఁ డిట్లనకుమయ్య రఘూత్తముపూజ కీవె భా
జనమవు సంశయంబయిన శర్వరి నిందు వసింపు నీకు సూ
చనయగు నన్న వల్లెయనె స్వప్నములో గురుఁ డల్లరేయి తె
మ్మనఘ! యతిత్వమూని శుభమందుమ రాముభజింపుమాయనన్

గీ. మేలుకొని సంయమికి స్వప్నలీలఁ దెలిపి
తదభినందితుఁడై దీక్షఁ దగ వహించి
యంది యక్షోభ్యవలనఁ దుర్యాశ్రమంబు
యతివరుం డాయె సాదిభూపతివరుండు. 51

సీ. కని పెంచి పెద్దఁజేసినతల్లి సాధ్వీమ
తల్లి నెయ్యముఁ ద్రోయఁదరమె యెందుఁ
దనకు విద్యాబుద్ధులను నేర్పి బాగుచే
సినతండ్రి నెనరుఁ ద్యజింపఁదగునె

అగ్నిసాక్షిగఁ బెండ్లియై నీడవలె నున్న
మానినినేస్తంబు మఱవవశమె
తనభావివృద్ధి నిత్యముఁ దలంచెడుచుట్ట
పక్కాలకూర్మి పోఁద్రొక్క పీల

గీ. వెండిబంగారు తడఁబడుచుండు గృహము
పూఁతమెఱుఁగుఁ దుటారించు లేఁతవయసు
లెక్కసేయక యతి యయ్యె నక్కుమారుఁ
డౌర ! వైరాగ్య మనఁగ నయ్యదియ కాదె ? 52

మ. జయముం గాంచు నితండు వాదిగజరాట్సంసన్మృగాధీశుఁడై,
జయనాముం డగు, విష్ణునం దితనికిన్ స్వాంతం బనంతంబగున్,
జయముంగూర్చు నితండు మధ్వమునిసచ్ఛాస్త్రానికంచో యన
న్జయతీర్థాభిధుఁ జేసె నీబుధు నిజాచార్యుండు కార్యజ్ఞుఁడై. 53

తోటకము. గుణరత్ననిధీ ! బుధకోటినుతా !
గణనీయచరిత్ర ! యఖండయశా !
తృణవద్గణితాహిత ! ధీవరల
క్ష్మణపుత్త్ర ! గుణాపణ ? మాధ్వమతా ! 54

—♦ గద్యము ♦—

ఇది శ్రీకాశ్యపగోత్ర జగన్నాథాచార్యపుత్త్ర
సకలవిద్వద్విధేయ పూర్ణప్రజ్ఞనామధేయ
ప్రణీతం బగు జయతీర్థవిజయంబున
ద్వితీయోచ్ఛ్వాసము.

శ్రీ

# తృతీయాశ్వాసము

క. శ్రీనాథపదాంబుజమధు
పానాతిప్రవణహృదయబంభర! సత్య
ధ్యానరత! పార్లవంశాం
భోనిధివరచంద్ర! నరసభూమిసురేంద్రా! 1

క. ముండితుఁడై యక్షోభ్యుల
దండన్ గూర్చుండి ప్రణవతత్పరమతియై
ధోండేరఘునాథుం గని
దండంబుం బెట్టి సాదితతి యతిభక్తిన్. 2

శా. స్వామీ! చాలదినంబులాయెఁ దమ రీసన్న్యాసి సేవించు చా
రామక్షేత్రగృహాదులన్ దడవ రారా! మేలు మీరాకకై
మీమాతాపితరుల్ తపించెదరు రమ్మీనాఁగ, సన్న్యాసి కా
రామక్షేత్రగృహాళి యేమిటికి? నే రానంచు నాతం డనన్.

గీ. అన్నివిధములఁ దెలిపియు నతఁడు వినమిఁ
జిన్నవోయి నివాసంబుఁ జేరి తండ్రి
కది దెలుప భిన్నమూలమా నవనిజంబు
తెలుఁగు మహిఁగూలి యాతండు తెప్పిల్లె. 4

శా. సాదీశుండు కుమారుఁ డట్లగుటకున్ స్వాంతంబునం దెంతయు
నేదంబంది యెవండు పట్టికి విర క్తిన్ బోధగావించె నా
సాదున్ జూపుఁడు వానికిం దగినశిక్షుంగూర్తు నం చుగ్రుఁడై
సాదు ల్మార్గముఁజూప నాశ్వికచమూసంరంభ మేపారఁగన్.

గీ. పోయి యక్షోభ్యతీర్థునిపుంత కచట
ముండితుండై విర క్తిఁ గూర్చుండుసుతుని
గాంచి కటకటపడి కిన్కఁ గటము లద్రువ
సంయమిం బల్కెఁ గనులు కెంజాయ లీన. ౬

మ. యతివా? వంచక! నీవు గోముఖమహావ్యాఘ్రంబ వే, పిల్వ నీ
నతికై రా ముకుపచ్చలాఱనిశిశున్ నాపుత్త్రు సన్న్యాసిఁ జే
సితి, మాతాపితరుల్ సతీమణియు నీజీవాన్నికై యేడ్వ మా
మతి క్షోభిల్లఁగఁ జేసి పుణ్యఫల మేమాత్రంబు నార్జింతువో.

క. మూలుగుచున్నవి ధనములు
మూలలమూలలను రాజ్యముం గల దకటా!
బాలు వెడమాయమాటల
బాలిశ! సన్న్యాసిఁ జేయఁ బాడియె నీకున్? ౭

ఉ. ఎందఱు తల్లిదండ్రులకు నిప్పగిదిన్ మదిఁజిచ్చువెట్టెదో
ఎందఱు మందయాన లెద నేడ్తురొ భర్తలు క్రొత్తబోడులై
సందుకు నిట్టిచెట్ట జగ మందకపూర్వమె యిప్పుడిప్డె ని
న్నుం దెగటార్తుఁ జూడుమని నోటికిరానిదురుక్తు లాడఁగన్.

గీ. యతియనియు లేదు సాష్టాంగనతులు లేవు
మాటనేని వినీతికిఁ జోటు లేదు
క్రుద్ధుఁ డీతండు వధియించు గురుల నేని
అని తలఁచి లోన జయతీర్థుఁ డనియె నిట్లు. 10

మ. గుణవారాశి మహానుభావుఁ డితఁ డక్షోభ్యాఖ్యుఁడో భిక్షుకా
గ్రణి, యీతండు బలాత్కరింపఁడు పరివ్రాజ్యాన్వితుం జేయ న
న్నణువే; నీబుధుఁ దూలనాడ దురితంబౌ నేనె యీసంపదల్
తృణముల్ గాఁదలపోసి యెంతయు విరక్తిం గొంటి సన్న్యాసమున్

చ. అదియునుగాక నాకుఁ గలయం దొకదివ్యుఁడు గోచరించి సం
పద మరుదభ్రవిభ్రమము ప్రాణములున్ జలబుద్బుదంబులోఁ
గద వృథసేయఁబోకు మిఁకఁ గాలము సంయమివై పరాత్పరున్
మది భజియించి ముక్తిఁగొనుమా యన నివ్విధి నే నొనర్చితిన్.

క. ఏలాగైనను నీయతి
మేలే గావించె నితనిమీఁదఁ గినియఁగా
నేల? విరక్తుఁడ నగునా
జోలిన్ విడు మన్నఁ దండ్రి సూనున కనియెన్. 13

ఉ. తీర్పవు సంతుఁగాంచి పితృదేవులు మెచ్చఁ బితౄణ మివ్విధిన్
దీర్పరివై వచింప గడిదేఱితి వీబికిరాలమారియే
నేర్పఁగఁబోలు నీకు జననీజనకోక్తుల నీదువీనులన్
దూర్పకుమంచు, నిన్ విడువఁ దోఁచునె మాకుఁ గుమార
[రత్నమా! 14

క. ఉట్టికెక్కలేని యయ్యలు
కట్టా! స్వర్గంబు నెక్కఁగలరే? యిట్టుల్
పట్టి! బోధించినయతిఁ
బట్టి వధించినను లేదు పాతక మనుడున్. 15

శా. అక్షోభ్యుం డనె సాదిభూప! యిపు డేమాయెన్ భవత్పుత్త్రుపై
నక్షీణం బనురాగ మున్నఁ గొనిపొమ్మా నాఁగఁ దారంగికా
ధ్యక్షుం డేనుఁగు నెక్కి నైకవిధభూషాలంకృతుంగా జయో
ద్భటుం దోడ్కొనిపోయె; సాదిబలముల్ వెంటాడఁగా నింటికిన్.

శా. రంగుల్ రంగులవల్పఁజిత్తరువులన్ రంజిల్లుసద్భిత్తికా
భంగుల్ ప్రేక్షకదృక్తరంగముల సంభావింపఁ బన్నీటి తే
టం గుప్పించి నిగారపుంబడకటింటన్ హృద్యవస్త్రావళుల్
సింగారించి సుతుం బరుండ నియమించె న్నాఁటిరే యచ్చటన్.

చ. అత్తయుఁ గోడలిన్ సురుచిరాభరణాళి నలంకరించి య
చ్చిత్తజుమోహనాస్త్రమనఁ జేసి రహస్యమునందుఁ బల్కె నో
మత్తచకోరనేత్రి! వినుమా దయితుండు విరక్తుఁడంట త
చ్చిత్తము నెట్లురంజిలఁగఁ జేసెదో చూతముగాక నేఁ డనన్

ఉ. అచ్చపలాక్షి రేయి శయనావసథంబున కేఁగి యెవ్వియో
ముచ్చటలాడ నిల్వఁ బతిముంగల, భర్త ఫణాసహస్రముల్
చెచ్చెర విచ్చి బుస్సుమను శేషుఁడుగాఁ బయిరాఁగఁ 'జచ్చితిం
జచ్చితి'నంచు బైటఁబడెఁ జాలభయంబునఁ గేకవెట్టుచున్.

గీ. బంధుజను లప్పుడే మూఁగి భయముఁ దీర్చి
పడఁతి! భయకారణం బేమొ నుడువు మనుచు
మఱిమఱియు గుచ్చి యడుగ నమ్మగువ వారి
కున్నదున్నట్లు తత్కథ విన్నవించె. 20

క. శయనాగారము నప్పుడు
భయభయమునఁ జేరి వారు పర్యంకమునన్
శయనించియున్న శ్రీమ
జ్జయతీర్థుం గనిరి మనసు సంభ్రాంతముగాన్. 21

గీ. అయ్యో! శయనించియుండె నియ్యనఘుఁ డిందుఁ
గలవరించెనో యేమొ యీకలికి మరలఁ
బంపిచూత మటంచు నాబంధుజనము
మెలఁత నటఁ బండఁగా నియమించి చనిన. 22

చ. మగువయు సెజ్జచెంతఁ బతిమన్నన కెంతయు వేచియుండఁగా
ధగధగఁ బ్రజ్వరిల్లుచు నుదగ్రతరార్చులఁ గ్రక్కువహ్నియై
బుగబుగమీఁదరా విభుఁడు బోటి భయంబునఁ గంపితాంగియై
తగులఁబడెన్ గృహంబనుచుఁ దత్తఱమెత్తి బయల్పడెన్ వడిన్.

గీ. మరల నెల్లరు గుమిగూడి మగువ నడుగ
నామె కలరూపు సెప్ప నగ్గిముఁ దఱిసి
యెప్పటట్లుగ సెజ్జ శయించియున్న
జయమునిన్ గాంచి వారు విస్మయముఁ జెంది. 24

గీ. అతులమహిమాన్వితుండుసు మ్మితఁ డెవండొ
యితని ధర్షించుటయుఁ బాపమే యటంచు
వారు నూఱకయుండి రవ్వార్త యెట్లొ
తెల్లవాఱెడుసరికి నూరెల్లఁ బ్రాఁకె. 25

సీ. అక్షోభ్యమౌని మహాప్రభావుఁడు తూల
నాడ వ్యర్థంబౌనె యనెడువారు
సన్న్యాసి మగుడ సంసారిఁ జేయఁగఁబూన
నంతెగా కింకెంత యనెడువారు
ఇతని కింతటిలోనె యింతవైరాగ్య మె
ట్లావిర్భవించెనో యనెడువారు
వైరాగ్యయుతు బలవంత పెట్టినయేని
యనురాగ మూనునా యనెడువారు

గీ. వేయిపడగలతోఁ జిల్వరాయఁ డగుచు
వనిత కేకాంతమునఁ గానవచ్చెనంట
యితఁడు శేషావతార మయ్యెడునొ యంచు
జనులు గుమిగూడి చెప్పికోసాఁగి రంత. 26

క. వినుచున్ దనయుదంతము
జనకుం డెంతయు విచారసాగరమందున్
మునుఁగ నొకనాఁటిసంజన్
వినఁబడె నాకాశవాణి వింతగ నిట్టుల్. 27

శా. సాదీశా! సుకృతాప్తిఁ బుత్త్రుఁడయి యీసర్వజ్ఞుఁ డిందాఁక నా
హ్లాదంబుల్ ఘటియించె నింక మిము నెల్ల న్వీడి యీతండు వే
ఱేదారిన్ బనిసేయఁగావలయు మీ రేయింతో యాదారికిన్
జేదోడ్పాదురుగాక యడ్డుపడుచో క్షేమంబు క్షామంబగున్.

క. అది విని సాదిక్ష్మాపతి
యెదఁ గలవరమంది భగవదిచ్ఛ యిటుండెన్
గద యక్షోభ్యానకే సుతు
ముదమున నర్పించుటే సముచితం బనుచున్. 29

ఉ. ఆమఱునాఁటిప్రొద్దుననె యాశ్వికసైన్యనియంత పుత్త్రితో
భీమరథీనదీతటిని బెంపెసలారెడు 'పాండురంగ' మన్
ధామముఁ జేరి యందు జపతత్పరుఁడై వసియించుసంయమి
స్వామిపదాంబుజంబులకు సాఁగిలి మ్రొక్కి వినీతభాషుఁడై.

క. అక్షోభ్యతీర్థయతిహా
ర్యక్షా! క్షమియింపుమా మదపరాధము లీ
భిక్షుకుఁ గైకొని కరుణా
వీక్షణముల నన్నుఁ జూడవే యన యతియున్. 31

మ. అనుతప్తుం డితఁ డంచు నెంచి యనె సాదధ్యక్షా! యీతండు త్వ
త్తనయుం డయ్యెఁ ద్వదీయపుణ్యమునఁ బూతం బయ్యె మీయన్వయం
బనఘా! స్వప్నకథానిదర్శనముగా యత్యాశ్రమంబు న్గ్రహిం
చెను బేరందు హరీచ్ఛ యిద్ది విడుమా చింతన్, శుభం బయ్యెడున్.

ఉ. ఒక్కవిధంబునం గుతుక మొక్కవిధంబుగ దుఃఖ మాత్మలో
నెక్కొన సాదిరాజు సుతునిం గననా నెటనేని యంచు లో
నక్కటికంబు వోవిడిచి యక్కటకంబును వీడె సంయమిన్
మ్రొక్కి 'పదేపదే' కొమరు మోమునె గాంచుచు దీనదృష్టులన్.

శా. అంతన్ సంయమి పూర్ణబోధరచితంబౌ గ్రంథసందోహ మా
ద్యంతంబున్ బఠియింపఁజేసి తదుదారార్థంబు బోధింప న
య్యంతేవాసి గురూదితంబుల విశేషార్థంబులం దెల్పుడున్
సంతోషించెఁ దదీయమౌ ప్రతిభ కాచార్యుండు సాశ్చర్యుఁడై.

మ. కలఁ డక్షోభ్యయతీంద్రుచెంతఁ బ్రతిభాఽఖండుండు తచ్ఛిష్యవ
ర్యులకెల్లం దలమానికంబు జయతీర్థుం డొక్కవిద్యాసము
జ్జ్వలుఁ డన్ మేటియశంబు కుందకుముదస్వచ్ఛంబునై సర్వది
క్కుల వ్యాపింపుడు వాదిసింహములు కూర్కుంగాంచకుండె న్వెఱన్

క. మేదురయశుఁ డాజయముని
వాదిమదేభములతోడ వాదైనతఱిన్
జేదోడుగ వాదోడుగ
నై దేశికమణికి జయము నాపాదించున్. 36

శా. ఆరూఢంబుల దుర్మతాటవుల నయ్యక్షోభ్యదావాగ్ని దు
ర్వారంబై నిజతర్కకర్కశతరారావానుకుర్వచ్ఛటా
త్కారోదారముగా దహింప జయతీర్థస్వామిచండానిల
ప్రారంభంబును దోడ్పడన్ విమతదుర్గంబుల్ మహిన్ నిల్చునే!

గీ. అంత నక్షోభ్యముని జయయతివరుండు
మతము స్థాపింపఁదగు నని మతిఁ దలంచి
విజయయాత్రల కనుప నవ్విబుధమౌళి
తనదు పేరికి సార్థకత్వంబుఁ గూర్చె. 38

చ. ప్రవచనసింహనాదములు భాసిల శ్రీజయతీర్థకేసరి
ప్రవరము ధారుణిం దిరిగి వాదిమదావళకుంభముల్ సుశా
స్త్రవివిధయుక్తిశాతనఖరంబులఁ జీలిచి తత్త్వమౌక్తికా
ళి వసుధఁ జల్లుటల్ విని విలీనములయ్యెఁ గుదృష్టిఫేరువుల్.

ఉ. మండిరి కొంద ఱాస్యముల మాడ్చిరి కొందఱు కొంద ఱందిరు
ద్దండముదంబు నభ్యుదయధామము గా జయతీర్థసంయమీం
ద్రుండు; తరంబె యందఱికిఁ దోషమిడన్? రవి వెల్గఁ గొన్ని తా
మండవె? కొన్ని మోములను మాడ్పవె? కొన్ని వికాసమందవే?

చ. గురు లిడువిగ్రహంబులను గోర్కి భజింపుచు వేదవాదత
త్పరమతులైన శిష్యులకుఁ బాఠము సెప్పుచు నన్యవాదిభీ
కరుఁడయి శ్రీజయార్యముని గ్రామములం బురుల న్వసించుచున్
ధరణి సమస్తముం దిరిగి ద్వైతమతం బభివృద్ధిసల్పుచున్.

మ. హరి సర్వోత్తముఁడౌఁ, బ్రపంచ మిది సత్యం, బెల్లజీవుల్ పర
స్పరసంభిన్నులు తారతమ్యకలితుల్, స్వాభావికానందని
ర్భరతావాప్తియె ముక్తి, భక్తి నది లభ్యంబౌఁ, బ్రమాణంబు లి
ద్దర నక్షాదులు మూఁడు, వేదము సమస్తం బాహరిన్ బేర్కొనున్.

క. అని యెల్లెడఁ జాటుచు నె
ట్లన నామ్నాయస్మృతీతిహాససుయుక్తుల్
కనఁబఱచుచు జయముని స
జ్జనులన్ ద్వైతాభిమానశాలులఁ జేసెన్. 43

శా. భిక్షుగ్రామణి! నేఁడు మాగృహమునన్ భిక్షానికం చుం దనున్
భిక్షింపన్ నిజపక్ష్యు లెల్లి యనుఁగానీ శాత్రవుల్ వాదపున్
భిక్షుల్ సేతు మనంగ నెన్నయిన వెన్వెంటంగొనున్, జేకొనున్
దక్షుండై జయదక్షిణోర్విజయయాత్రన్ శ్రీజయార్యుండహో!

ఉ. అందఱి భాష్యము ల్దొసఁగులౌనను నీయతి యంచుఁ బండితు
లొందఱు మాధ్వభాష్యమదిగొప్పయె తప్పుల నెంతుమంచు నా
నందయతీంద్రుభాష్యము వినన్ వలెనన్న జయీడ్బుధుండు చె
ప్పం దొడఁగెన్ సదస్యులు సెబాసనఁ, గిమ్మన రైరి పండితుల్.

సీ. తార్కికులకు గుండె తల్లడంబాయెను
ప్రాభాకరాస్యాల శోభ తఱఁగె
వైభాషికుల కెల్ల వాగ్బంధనం బాయె
నద్వైతవాదుల కదురుపుట్టె
భాస్కరసిద్ధాంతిభావముల్ క్షోభిల్లె
సాంఖ్యులకున్ గుండె జల్లుమనియె
శైవనైయాయికసంరంభములు మాసెఁ
బాషండులకు భంగపాటు గలిగె

గీ. దండిపండితు లొప్పెడునిండుసభను
ద్వైతతత్త్వంబులను సమర్థన మొనర్చి
నవనవోన్మేషధిషణాభినంద్యతముఁడు
జయయతీంద్రుండు మధ్వభాష్యము వచింప. 46

క. గారిమగారిమంబుల నా
ధీమహితుం డిట్లు సభలఁ దీర్చుచు విజయ
శ్రీమహిళలఁ గొనెఁ దిరుగని
భూములు లే వనఁగ భరతభూభాగమునన్. 47

మ. జయము ల్వల్కుచు నివ్విధి న్నడుమ స్వాచార్యాగ్రణిన్గాంచుచు
న్జయపత్రంబులు విత్తముల్ గురుపదాబ్జాతంబులం బెట్టి త
ద్దయుకున్ భాజనమౌచు భీమరథిచెంతం బెక్కులేడుల్ మహా
నియముండై జయమౌని గొల్చె నజురాణి న్వాణి నేకాగ్రతన్

ఉ. ఆయమ యాయమాన్వితున కంతటఁ గానఁగవచ్చి, గంట మొం
డాయన మిచ్చి, పూగ మొకఁడద్భుతవృత్త మొసంగి, టీక లో
ధీయుత ! మధ్వవాక్తతికి దీన లిఖింపుము దీన శుద్ధముల్
జేయుమటంచుఁ బల్కె చనఁ జిత్తమున న్ముదమంది యంతయున్

క. గంటముఁ బూగముఁ గొని యా
దంట నలువమచ్చెకంటిదాపున నొజ్జన్
గంటకు సెలవుంగొని యు
ప్పంటవలఁతిఁ బాసి వేగఁ బయనంబగుచున్. 50

సీ. సింహాంబులకు యతిసింహాంబులకుఁగూడ
నాశ్రియం బగుదరు లమరుదాని
ఫలములచేఁ దపఃఫలములచేఁగూడ
ద్విజకోటి హర్షాబ్ధిఁ దేల్చుదాని
సరసులచేఁ బెక్కుసరసులచేఁగూడ
దర్శనీయంబయి తనరుదానిఁ
గూటాగ్రములఁ దరుకూటాగ్రములఁగూడ
నంబరచుంబియై యలరుదానిఁ

గీ. జేరి యరగోళగిరి నందు శిష్యతతికిఁ
బాఠములు సెప్పనక్షోభ్యపాదములకు
మ్రొక్కి నిలుచుడు జయముని నక్కుఁజేర్చి
కుతుకమునఁ గౌఁగిలించె నక్షోభ్యగురుఁడు. 51

మ. ఘనుఁ డక్షోభ్యయతీశుఁ డిప్పగిదినేఁగ న్నొన్ని యేం డ్లున్నతిం
దనయత్యద్భుతవర్తనాదికముచేతన్ మధ్వసిద్ధాంతబో
ధనవైపుణ్యముచే జయాభిధుఁడు మోదంబియ్యఁ దా నేగు దెం
చినకార్యం బదిచక్కనాయెనని నిశ్చింతాంతరంగుండునై. 52

గీ. అఖిలమున్ జయతీర్థున కప్పగించి
కల్యమునను సమస్తాహ్నికములఁ దీర్చి
చేరి మళేడిఁ గాగినీతీరమందు
దిగ్విజయరాముపైన మదిన్ లగించి.

కం. కైవల్యపదముఁ గొని వి
శ్వావసుమార్గశిరబహుళపంచమినాఁటన్
గోవిదుఁ డక్షోభ్యుఁడు బృం
దావనగతుఁ డయ్యె భక్తతతి సేవింపన్. 54

గీ. అధికవిజ్ఞానుఁ డయ్యు జయార్యనియమి
గురువియోగంబునకుఁ జాలఁ గుంది మదిని
దనకు యరగోళశైలకందరము మంది
రముగఁ గైకొనెఁ డీకావిరచనమునకు 55

కం. లోకోపకృతికి మధ్వసు
ధీకృతకోశముల కెల్లఁ దెల్ల మగునటుల
టీకలు రచించి జయముని
టీకాకృద్బిరుదమున్ గడించెన్ బుడమిన్. 56

సీ. బ్రహ్మసూత్రప్రోక్తభాష్యహారస్ఫార
తత్త్వప్రకాశికోదారలక్ష్మి
అమలగీతాసుభాష్యాంబరాలంబిప్ర
మేయదీపిక పేరిమిహిరకరుఁడు
ప్రఖ్యాతిభాగనువ్యాఖ్యానసద్భాజ
నన్యాయసుధ పేరినవ్యసుధయు
గీతాసుతాత్పర్యజాతప్రకాశజా
గ్రన్న్యాయదీపికాకౌస్తుభంబు

గీ. విమలఋగ్భాష్యనిర్ఝరవిభున కర్హ
మై వెలయుటీకపేరి యైరావతంబు
అన్యములు నెన్నొ టీకాద్యనర్ఘమణులుఁ
బొడమె జయతీర్థుఁ డనుపాలకడలినుండి. 57

క. ధీరుఁడు జయముని సుఖతీ
ర్థేరితసద్గ్రంథవరుల కెల్ల స్వటీకా
దారికలఁ గూర్చి బుధస
త్కార మొసఁగఁ జేసె లోకకల్యాణంబున్. 58

గీ. జైత్రయాత్రలఁ జేయుచు జయయతీంద్రు
ఛాత్రులు ప్రగల్భులై ధాత్రి సంచరింప
వాదులకు నిద్రయన్నది లేదు సింహ
పోతములచెంతఁ గరులకుఁ బోలె నంత. 59

సీ. ఎవనిప్రతిభ కోడి యెల్లబుధుల్ కవా
టములు బిగించి పాఠము వచింత్రు
ఎవఁడు వేదంబులకెల్ల భాష్యము వ్రాసి
విజ్ఞానలత కల్లువేసినాఁడు
ఎవనిపేరిట వన్నెకెక్కె విద్యానగ
రంబు శ్రీబుక్కరాడ్రాజధాని
ఎవఁడు శాంకరపీఠ మెక్కి యద్వైతమ
తప్రబోధము సమర్థత నొనర్చె

గీ. విద్యల కరణ్యమైనయవ్విబుధమూర్తి
జైత్రయాత్రలు సల్పుచు జయయతీంద్రు
పాండితీస్ఫూర్తి విని జిగీషుండువోలెఁ
గరివరం బెక్కి యరగోళగిరిని దఱిసె. 60

క. విద్యారణ్యుఁడు గజరా
డుద్యానం డగుచు వచ్చుచుండె నటంచున్
విద్యార్థులు దెలుపఁ బరా
భేద్యుఁడు జయతీర్థమౌని భీతిఁ గనఁ డెదన్. 61

క. ఏనిక డిగి యాబుధుఁడు గు
హానికటముఁ జేరి 'యుండెనా ? వాది యెవం
డే నిట' నన జయతీర్థుఁడు
నే నుంటిన్ రమ్మటం చనెన్ నిర్భీతిన్. 62

ఉ. ఆతనితాల్మి కవ్విబుధుఁ డద్భుతమంది గుహాప్రవిష్టుఁడై
జోతమొనర్పఁగాఁ గుశలసూక్తులపై జయమౌని మీరు వి
జ్ఞాతలు భాష్యకర్తలఁట చాలఁ గుతూహలమయ్యె లోకవి
ఖ్యాత ! ప్రమాణలక్షణమునం దొకవాక్యము సంగతింపవే.

గీ. అనుచుఁ బలికి ప్రమాణలక్షణ మొసంగ
హేలగా నందుకొని చూచి యెఱుకపడమి
మఱిమఱియుఁ జూచి యిది మహోన్మత్తప్రలపి
తం బగుంగాని కాదు గ్రంథం బటన్న.

శా. ఉన్మత్తాలపితంబె? జంబుకము ద్రాక్షోదంతమ ట్లుండెఁబో
కన్మాయంచని చూప దానికి స్వటీకన్ శ్రీజయుం డాతఁడున్
దన్మేధాపటిమంబు మెచ్చుకొని తద్గ్రంథంబుతో నాజయున్
సన్మానించె గజాధిరోహణమహాసత్కారపూర్వంబుగన్.

శా. అంతన్ శ్రీజయతీర్థసత్కృతులు విద్యారణ్యు లాలింపఁగా
స్వాంతంబున్ వెలిఁబుచ్చె నాజయమునీశానుండు పూరించి య
య్యంతర్వాణిమనోరథంబు విబుధుండౌ నర్హ్మమంచుం దుదిన్
సంతోషంబలరారఁ జేసెను సుధాసంతర్పణం బెంతయున్.

క. సుధ నేనిఁ జెప్పవలయు వ
సుధ నేనియు నేలవలయుఁజుఁడి యని జయరా
డ్బుధున్యాయసుధారచనా
విధముం గొనియాడి రపుడు విద్యారణ్యుల్. 67

గీ. తమకు వారికి మదుల భేదంబు లున్న
సరకుసేయక యమ్మేటి జయయతీంద్రు
సత్కృతుని జేసి సౌమనస్యంబుఁ జాటె;
విద్యగలచోటులను గౌరవింతురు బుధులు. 68

శా. విద్యారణ్యుఁ డనంగ సర్వజయియౌవీరుం డితండే మిమున్
హృద్యంబౌ భవదీయటీక నిట నూరేగించె నాగేంద్రుపై
వాద్యంబుల్ జయ వెట్ట వైరివలనన్ వచ్చె న్మహాఖ్యాతి మేల్
వాద్యగ్రేసర! యంచు మెచ్చిరి జయాద్వైదుష్యముం బండితుల్

శా. వాదీంద్రుండనుమాయి యంత జయభాస్వత్కీర్తి సైరింపమిన్
వాదార్థం బరుదెంచి పెక్కుదినముల్ వాదించి యైక్యంబునన్
లేదాధారమనన్ జయార్యుఁడు, బదుల్ లేకర్థరాత్రంబునన్
గేదారాంతరగూఢమార్గమున సాఁగెన్ ఖేదపాథేయుఁడై. 70

గీ. నాఁడు మొదలుగ జయతీర్థువాడ యన్న
నొక్కవాదియు రాఁడు పేర్దక్కదనుచు;
శిష్యపాత్రాళితో హరిసేవతోడఁ
జక్కఁగాఁ గాల మేగె నాజయున కపుడు. 71

శా. కొన్నాళ్ళచ్చట నుండ శూద్రనృపుఁడాకొండన్దటాకం బుద
న్వన్నీకాశముఁ ద్రవ్వఁజేసి రచియింపన్ సేతువున్ మాటికిన్
భిన్నంబౌటను రోసి వేఁడ జయు గాడ్భిత్త్వగ్రిణిన్, ముష్టితో
మన్నేయన్ ముని నేఁటికిన్ స్ఫుటిత మేమాత్రంబు కాదద్దిరా!

క. మఱియు నొకనాఁడు జయతీర్థమౌని ప్రణవ
మంత్రము జపించి విష్ణునిర్మాల్యకుసుమ
ములను దీయుచు శ్రీవ్యాసమూర్తుల నిజ
శిష్యులకుఁ జూపె వార లచ్చెరుపడంగ. 73

మ. ఇటు లత్యద్భుతచర్యుఁడౌ జయుఁడు మాయాభాంకుశంబై కకు
బ్భటులం గీర్తి వెలుంగఁ దీర్థముల సందర్శించి విద్యాధిరా
డ్జటికిం బీఠముఁ గట్టిపెట్టి విభవాషాఢంబునన్ గాగిణీ
తటి మళ్ఖేడ్పురిఁ గృష్ణపంచమిని బృందాసంస్థుఁడై రాజిలెన్.

గీ. అద్భుతంబులు మధ్వశాస్త్రార్థములను
స్వీయగోగణములఁ బ్రకాశింపఁ జేసి
జ్ఞాన మొసఁగినజయతీర్థభానుమూర్తి
వెలుఁగుత మదీయహృదయాభ్రవీథియందు. 75

గీ. అనిశమున్ మధ్వశాస్త్రదుగ్ధాబ్ధియందుఁ
గ్రీడ సలిపినయాజయరాడిభంబు
నా కజస్రంబు జన్మజన్మంబునందు
నందుఁ గ్రీడించుభాగ్యంబు నందఁజేయు. 76

చ. అమలము తాపవారకము నై భగవత్పదసంగపూతమై
కుమతమహాతటంబులను గూలుపఁజాలినయట్టిచండవే
గము గలదౌ జయార్యగుణవికస్వరభాస్వరయుక్త్యనర్ఘవా
గమరతరంగిణీసురుచిరౌఘము నాయఘముల్ హరించుతన్.

ఉ. నాలుగొ యైదొ యాఱొ వదనంబులు గల్గినవారుగాక యి
బ్బాలురశక్యమే జయునిప్రౌఢచరిత్ర లిఖింప ? వ్రాసితిన్
నాలఘుబుద్ధిఁ గొన్నివచనంబులు; నీరముఁబుచ్చి క్షీరమే
గ్రోలెడుహంసలట్లు లిటఁ గోవిదులున్ గుణమే గ్రహింపరే.

క. ఇది భవ్యమహాభ్యుదయా
స్పద మగుజయతీర్థవిజయసత్కృతి; దీనిన్
జదివినను వినిన జయముని
సదనుగ్రహపాత్రు లగుచు జయు లగుదు రిలన్. 79

శా. శ్రీసంకర్షణపండితుండు బుధుఁడౌ శ్రీవ్యాసతీర్థుండు మే
ధాసంపత్తి నొనర్చినట్టి జయవృత్తాంతంబు నీక్షించి త
చ్ఛ్రీసూక్తుల్గొని, చేర్చినూత్నములనౌచిత్యంబుఁబోషించుచున్
వ్రాసెన్ దీనిని బళ్ళెసత్కులుఁడు పూర్ణప్రజ్ఞుఁ డుద్యన్మతిన్.

ఉ. నన్నయతిక్కనాదికవినాథులు పోయినపోకలున్ గుణా
భ్యున్నతులౌ ప్రబంధకవిపుంగవు లేఁగినత్రోవలున్, బ్రయో
గోన్నతినిందుఁగూర్చితి రసోచితముల్ గలవన్యముల్; బుధుల్!
విన్నప మాచరించితిని; వేఁడెద వీడఁగ మత్ప్రమాదముల్.

సీ. లక్ష్మీసరస్వతీలాస్యహాస్యములతో
మానితంబై యొప్పు మాగృహంబు
పెన్నానదీతటిం జెన్నారి నెల్లూరు
దాపురంబుగ నుండు మాపురంబు
నాపేరివానిచే స్థాపితంబై జగ
న్మాన్యతఁ గన్నది మామతంబు
చేనేత నెంత యిచ్చినఁ దఱుంగక వర్ధ
మానమై తనరారు మాధనంబు

గీ. ఇట్టియీనేను 'గుంటూరుపట్టణస్థ
మాధ్వసంఘంబు' ప్రేరేచ మాన్యజయవి
జయకృతిని వ్రాసి యిచ్చితి సంఘమునకు;
నాయుడుతబత్తి కిద్ధి చిహ్నమగుఁగాత! 82

వసంతతిలకము. శ్రీపార్లవంశసరసీరుహవారిజాప్తా!
కోపాతిగా! మధురకోమలమంజుభాషా
ఆపన్నభూరికృప! యాదృతబంధువర్గా!
ధీపన్నగేడ్వ్రతినిధీ! నరసద్విజేంద్రా! 83

క. ఘన 'మొరుసుపల్లి' సత్కుల
జని శేషమరామకృష్ణజననీజనకా!
వినుతాచారా! శ్రీమ
ద్ధనమాయీ లక్ష్మణార్యదత్తకుమారా! 84

తోటకవృత్తము. వరగుంటురుపత్తనవాసి గుణో
త్తరమాధ్వసభాపతి! ధర్మరతీ!
సరసాంతర! తత్త్వవిచారమతీ!
నరసాభిధ! భూసురనాథమణీ! 85

—♦ గద్యము ♦—

ఇది శ్రీకాశ్యపగోత్ర జగన్నాథాచార్యపుత్ర
సకలవిద్వద్విధేయ పూర్ణప్రజ్ఞనామధేయ
ప్రణీతం బగు జయతీర్థవిజయంబున
సర్గంబును ద్వితీయోచ్ఛ్వాసము.

శ్రీ

గుంటూరు, చంద్రికా ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడినది.

# ఏతద్గ్రంథకర్తృ విరచిత గ్రంథములు

| | | |
|---|---|---|
| శ్రీరామకల్యాణము (ప్రబంధము) 1933–34 సం॥న యఫ్.ఏ. కుఁ బఠనీయము) | | 0-12-0 |
| ఆంధ్రకాదంబరి (పూర్వార్థము) | ... | 1- 4-0 |
| ఆంధ్రకాదంబరి (ఉత్తరార్ధము) | ... | 1- 0-0 |
| ద్విపద మేఘదూతము ... | ... | 0- 6-0 |
| కైకేయీ సౌశీల్యము ... | ... | 0- 4-0 |

## ముద్రణమునకు సిద్ధముగ నున్న గ్రంథములు.

### శతలక్షణి

(వ్యాకరణ విమర్శగ్రంథము)

ఇందుఁ బలువురచే దుష్టములని గ్రహింపఁబడిన పూర్వకవి ప్రయోగము లనేకములు సాధింపఁబడినవి.

### కావ్యాలోకము

(ఇందుఁ గావ్యాంగము లన్నియుఁ బూర్వప్రబంధోదాహరణములతో సంగ్రహముగాఁ దెల్పఁబడినవి)

### రుక్మిణీశవిజయము

(శ్రీవాదిరాజయతీంద్రపూజ్యపాదవిరచితమగు రుక్మిణీశవిజయమునకు సరసమగు నాంధ్రీకరణము)

### మధ్వవిజయము

### ఉపాహరణము